సత్యము, దానశీలత గురించి విశదీకరింపబడి వెలువడిన కథలన్నింటిలోనూ రాజా హరిశ్చంద్ర కథ ప్రసిద్ధికెక్కినంతగా మరే కథ ప్రసిద్ధి చెందలేదు.

అతని దురదృష్టమునకు మన హృదయము జాలితో బాధపడి క్రుంగిపోతుంది. ఇప్పుడు మనము అనుసరించలేకపోయినా అంతటి గొప్ప రాజు సత్యము కోసమై అన్ని కష్టములను దృఢ విశ్వాసము, నమ్మకము, భక్తితో ధైర్యముగా ఎదుర్కొన్నందుకు అతనిని అభినందించవలసి యుంటుంది.


కథను సూచించి, రచనను ఆమోదించినది

స్వామి చిన్మయానంద

సంపాదకుడు : డి. కుమార్ లేఖకులు : జగ్జిత్ ఉప్పల్

చిత్రకారులు : పి.జి. బందోద్కర్

అనువాదం : తిప్పరాజు రమేష్ బాబు



తిరుమల తిరుపతి దేవస్థానములు, తిరుపతి (ఆం. ప్ర.) వారికై, గీతా కుమార్, ఆర్గస్ సెంట్రల్ ఎంటర్‌ప్రైజెస్, 16, గోల్ఫ్‌లింక్స్, న్యూ ఢిల్లీ-110 003, వారిచే ప్రచురింపబడి, జె. ప్రింట్ ప్యాక్ (ప్రై) లిమిటెడ్, 8/39, కీర్తి నగర్, ఇండస్ట్రియల్ ఏరియా, న్యూ ఢిల్లీ-110 015 నందు ముద్రింపబడినది.

# హరిశ్చంద్ర

ఒకప్పుడు భూమండలమున నున్న గొప్పపండితు
లందరు దేవతలలో త్రిమూర్తులైన బ్రహ్మ, విష్ణు, మహే
శ్వరుల్లను దర్శించిరి. వారిలో ఋషులు విశ్వామిత్రుడు,
వశిష్ఠుడు ముఖ్యులు.






వారిలో ఆగ్రహావేశ స్వభావములకు విశ్వామిత్రుడు, శాంత
స్వభావము, సమయస్ఫూర్తి ఆలోచనలకు వశిష్ఠుడు పేరు
గాంచిరి. అందుచే విశ్వామిత్రుడు ఎల్లప్పుడూ వశిష్ఠుని
చూచి అసూయ పడెడివాడు.




మహర్షీ! మీరే గొప్పవారు. సూర్యవంశమునకు చెందిన రాజు హరిశ్చంద్రుని గురించి దేవతలు చర్చించుచున్నారు.

దానితో నాకేమిటి సంబంధము? నువ్వు చేయవలసిందేమిటి?

విశ్వామహర్షీ! హరిశ్చంద్రుని
కుటుంబమునకు నేను గురువుగా
నుండుటు సంభవించినది. ఇటీ
వల అతడు రాజసూయ యాగ
మును చేసెను. మానవులందరి
లో మా హరిశ్చంద్రుడు దాన
శీలుడు, సత్యవంతుడని
దేవతలు చెప్పు
కొను
చున్నారు.

ఓ! నిజంగానా?
అతడు సత్యవంతు
డేనా? వరుణదేవుని
ఉపాంఖ్యానమును
నువ్వు మరచి
పోయావా?


"హరిశ్చంద్ర, తారామతులకు సంతానము
లేనప్పుడు వరుణ దేవుని ప్రార్థించమని
నువు సలహా యిచ్చితివి కదా!...


"రాజు తపస్సునకు సంతుష్టుడైన వరుణుడు
అనుగ్రహించి తనకు బలి చేయవలెననే
నిబంధనతో ఒక పుత్రుని పొందుటకు వర
మిచ్చెను. హరిశ్చంద్రుడు అట్లు చేయుటకు
అంగీకరించెను కదా...?"

"త్వరలోనే తారామతికి అందమైన బాలుడు జన్మించి, రోహితుడని పిలువబడెను..."



"రాజు, రాణి తమ పుత్రునితో కూడ చాలా సంతోషకరమైన జీవితము గడిపిరి. వరుణ దేవునికి ఇచ్చిన మాట హరిశ్చంద్రుడు మరచెను..."



"హరిశ్చంద్రునికి జ్ఞాప్తికి తెచ్చుటకై వరుణదేవుడు వచ్చినప్పుడు ఏదో ఒక నెపముల్యో మిషతో ఇతనిని పంపించివేసెను..."



"రోహితునికి బదులుగా ఒక బాలునికొని, అతనిని వరుణదేవునికి బలి ఇవ్వమని హరిశ్చంద్రునికి నువ్వు సలహా ఇచ్చితివి..."






వీటన్నిటిని విడిచి, మరచి హరిశ్చంద్రుడు దానశీలుడు, సత్యవంతుడు అని నీవు చెప్పుచున్నావా?

ఓ! విశ్వామిత్రా! నిజముగా అతడు సత్యవంతుడే! మీరు వర్ణించినదంతయూ నిజమే. కానీ, అప్పటి నుంచి హరిశ్చంద్రుని నీతి అభివృద్ధి చెందినది. నిస్సందేహముగా ఈ రోజున అతడే ఈ ప్రపంచమున మంచి చక్రవర్తి!

వశిష్ఠుడు హాడిగియ్యా —

ఈ విధముగా మాట్లాడుతున్నందుకు నన్ను క్షమించవలసిందే. నీవు మహర్షి కావటానికి ముందు అజ్ఞానివై ఈ ప్రపంచమున యుద్ధములు, గొడవలలో నిమగ్నుడవు కాలేదా? ఓ విశ్వామిత్రా! కాలాను గుణముగా వ్యక్తి మార్పు చెందుతాడని తెలుసుకో!

వశిష్ఠా!
నువ్వు మూర్ఖమైన పట్టు
దలగలవాడివి. కానీ
హరిశ్చంద్రుడు ఇప్పటికీ
తను ఇచ్చిన మాటను తప్పు
తాడని నేను నిరూపించి
చూపించగలను.

విస్మయము చెందిన ఋషులు
అట్టె గాంచుటకు ముందే విశ్వామి
త్రుడు ఆవేశపరుడై, గర్వముగా అడు
గులు వేస్తూ ఆ సమావేశము నుండి
నిష్క్రమించెను.

ఇంతలో హరిశ్చంద్రుడు తన రాజ్యమున వేటకై బయలు దేరెను.





గొప్పవంశస్త్రీవైన నువ్వు ఎవరివు? అడవిలోనుండుటకు కారణము ఏమిటి? నేను నీకు ఏమైనా సహాయము చేయగలనా?

నా పేరు సిద్ధరూపిణి. నేను నిష్కపటమైన మానవుల కోర్కెలను తీర్చు దేవతను. విశ్వామిత్రుడు నన్ను పొందుటకు ఘోరతపస్సు చేయుచున్నాడు. దయచేసి అతని బారినుంచి తప్పించి నన్ను కాపాడవలసింది!

దేవీ! నేను మహర్షితో మాటాడి, అతని తపస్సు మాన్పించెదను. శాంతముగానుండుము.

హరిశ్చంద్రుడు గుఱ్ఱముపై విశ్వామిత్రుని ఆశ్రమము చేరుకొనేను.








మహర్షి వద్ద శలవు తీసుకుని హరిశ్చంద్రుడు తిరిగి వెడలెను.



అగ్రహావేశుడైన విశ్వామిత్రమహర్షి, అసురుని* తక్షణము రావలసిందిగా ఆజ్ఞాపించెను.




అసురుడు అడవిపంది రూపము నొంది...



* దయ్యము, పిశాచము.

... ఒక్క పరుగున అక్కడకు చేరి, బ్రహ్మాండమైన ఆ రాజోద్యానవనమందలి చెట్లను పెఱికి, పొదలను, గుల్మములను, అందమైన పుష్పపాన్పులను త్రొక్కి వేసెను.



రక్షకభటులు ఆ అడవి జంతువును పారద్రోలుటలో విఫలులై, ఆ అడవి పంది తఱుముటచే వారు భయపడి స్త్రీలతో కలసి పారిపోయిరి.



ఏమి జరుగుచున్నది?
ఎందుచేత బయట
చాలా కలవరముగా
ఉన్నది?

మహారాజా!
ఒక అడవి పంది
రాజ ఉద్యాన వనమును
ధ్వంసము చేయు
చున్నది.

సేవకులను వెంట బెట్టుకుని రాజు గుర్రము పై ఉద్యాన
వనమునకు బయలుదేరెను.



అడవి పంది అతనిని చూసి పారిపోవుచుండెను.



ఆ అడవి పంది చాలా వేగముగా పరిగెత్తుచుండుటచే హరిశ్చంద్రుని బాణము గురి తప్పెను.



ప్రయాసపడి దూరముగా తరుము కొనివచ్చుటచే హరిశ్చంద్రుడు తన సేవకుల నుంచి వేరుచేయబడెను.




అడవిపంది హఠాత్తుగా అదృశ్యమై, హరిశ్చంద్రునికి దిగ్భ్రమ కలిగించినది.



ష్! చాలా దూరము తరుముకుని వచ్చాను. కాదిసేపు విశ్రాంతి తీసుకొందును.

హరిశ్చంద్రుడు, అతని గుఱ్ఱము దగ్గరలోనున్నప్రవాహపు నీటిచే తమ దాహమును తీర్చుకొనెను.






విశ్వామిత్రుడు ఒక పేద ముసలి బ్రాహ్మణుని వలె మారువేషమును ధరించి హరిశ్చంద్రుని సమీపించెను.



నేను అయోధ్యకు చెందిన హరిశ్చంద్రుడను.

హరిశ్చంద్రా! నిన్ను కలుసుకొనుట నిజముగా నా అదృష్టము. ఒంటరిగా ఈ అడవిలో నువ్వు ఏమి చేయుచున్నావు?

అయ్యా! దారి తప్పివచ్చితిని.

మహారాజా! బాధపడవద్దు. రాజ్యమునకు వెళ్ళుటకు నీకు మార్గమును నేను చూపించెదను.

మీరు చాలా దయా హృదయులు. మీ సేవాఫలితముగా మీరు నన్ను ఏది కోరినా ఇచ్చుకొందును. నేను రాజసూయయాగము చేసి నఫుడు అట్టి ప్రతిజ్ఞ చేసియున్నాను.
రాజా! నీవు నిజముగా ఔదార్యుడవు. నేను ఏమి కోరినా ఇది ఇచ్చెదనని మాట ఇవ్వగలవా?
నేను ఇటులనే చేయుదునని మీకు మాట ఇచ్చియున్నాను. మీ ఇష్టము వచ్చినది కోరుకొనుము.

తనయోగమహిమచే విశ్వామిత్రుడు ఒక పురుషుని, ఒక స్త్రీని సృష్టించెను.





ఆ బ్రాహ్మణుడు రాజును అడవి నుంచి బయటకు తీసుకుని వచ్చి మార్గమును చూపించి శలవు తీసుకుని...




తమ రాజు తిరిగి వచ్చుటచే రాణి యెంతో సంతోషముగానున్నది



ఆ సమయమున విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని రాజ భవనమునకు విచ్చేసెను.








" విశ్వామిత్రుని రాక విన్న వెంటనే హరిశ్చంద్రుడు ఆయనకు స్వాగతమిచ్చుటకై త్వరగా బయటకు వచ్చెను.



తనని అడవిలో కలుసుకొన్న ముసలి బ్రాహ్మ
ణుడే ఇతడని హరిశ్చంద్రుడు గుర్తించెను.








హరిశ్చంద్రుడు ఒక్క క్షణము కూడా సంకోచించలేదు. అతను మహర్షికి సాష్టాంగ నమస్కారము చేసి, అప్పుడే తన సింహాసనమును, మొత్తం రాజ్యమును, ఆస్తిని పరిత్యజించెను.



- స్వేచ్ఛా పూర్వకముగా ఇచ్చు బహుమానము.

హరిశ్చంద్రుడు, తారామతి, లోహితుడు రాజభవనమును విడిచి బయలు దేరిరి.



హరిశ్చంద్రుడు కుటుంబ సమేతముగా కాశీపట్నం చేరి, అక్కడ నివశించుచుండెను.



ముప్పది రోజుల తరువాత విశ్వామిత్రుడు కాశీ వచ్చెను.




నీవు అన్నమాటయే
కదా హరిశ్చంద్రా! నీవు
ఇచ్చిన మాట తప్పి,
వెనకడుగు వేయు
చున్నావు కదా!


ప్రభూ!
నన్ను ఎవరికయినా
అమ్మి, ఆ ధనముచే
మహార్షి ఋణము
తీర్చుకొనుము

హరిశ్చంద్రుడు తన దురదృష్టమును నమ్మలేకపోయెను. తన ప్రియ రాణిని దాసిగా అమ్మబోవుచున్నాడు! కాని తప్పక ఏదో ఒకటి చేయవలెను. కనుక ఆ రాణిని బజారు తీసికెళ్లెను.



అక్కడ ఒక బ్రాహ్మణుడు ఆమెను రోహితుని సమేతముగా కొనెను.



ఇది నా దయా హృదయమును బద్దలు కొట్టుచున్నది. తారామతీ, లోహితా! దేవుడు మిమ్ము కాపాడుగాక!

కొంత కాలము తరువాత విశ్వామిత్రుడు తన ఋణము వసూలు చేసుకొనుటకు వచ్చెను.

నీవు ఇచ్చునది ఇంతేనా? ఇది చాలదు. నా అంతస్థుకు తగిన రాజు ఇంకా ఎక్కువ ఇవ్వవలసి ఉంటుంది!

సూర్యాస్తమయము లోగా నీవు నాకు మొత్తము చెల్లించవలసి ఉంటుంది. అట్లు కాని చో నా కోపాగ్నికి గురి కాగలవు.

ఇంత దురదృష్టపాలగుటకు నేనేమి చేసితిని? దేవా! నన్ను రక్షించుము.


హరిశ్చంద్రుడు తిరిగి బజారుకు వెళ్లెను.
నేను అమ్ముడు పోదలచుకున్నాను ఎవరైనా ధనమిచ్చి నన్ను కొనగల వారున్నారా?


రాజఠీవి గల అతనిని ఆపట్టణ ప్రజలు చూసిరి. అయోధ్యకు చెందిన రాజైన హరిశ్చంద్రుడే ఇతడని, మరెవ్వరూ కాదని కొద్దిసేపటికే గుర్తించిరి.

అయ్యా!
దయచేసి ధనమిచ్చి
నన్ను కొనువారెవరైనా
ఉన్నారా?

నీచకులమునకు చెందిన ప్రవిరుడు హరిశ్చంద్రుని శ్రద్ధగా గమనించి...




... హరిశ్చంద్రుని కొనెను.
నాకు శ్మశాన వాటికలు కలవు. నీవు వాటికి రక్షక భటుడుగా ఉండవలెను.
మీ రేమి చెప్పినా అట్లు చేయుటకు నేను సిద్ధముగా ఉన్నాను.

శ్మశానమున శాస్త్రకర్మలు, క్రియలు జరుపుకొనుటకు వచ్చిన వారిని అనుమతించుటకు ముందు వారినుంచి సరియైన రుసుము వసూలు చేయవలెనని గుర్తుంచుకో!
మీ ఇష్టప్రకారమే అయ్యా!

తన దక్షిణలోని మిగులు భాగమును వసూలు చేసుకొనుటకై అప్పుడే విశ్వామిత్రుడు వచ్చెను.




హరిశ్చంద్రుని ధనముకు బదులుగా త్రవిరుద్రప్రయాగ దేశము నందలి కొద్ది భూమిని విశ్వామిత్రునికి ఇచ్చెను.



తన దక్షిణ ఋణము తీర్చినందుకు తృప్తి చెందిన విశ్వామిత్రుడు హరిశ్చంద్రుని చండాలుని కడ విడిచి వెళ్లెను.






తారామతిని కొన్న బ్రామ్మణుడు ఆమెచేత తన యింటి చాకిరీ అంతా చేయించుకొనుచుండెను.



అప్పుడప్పుడూ ఆమె అర్ధరాత్రివరకూ పని చేసేది...



... ఆమె అతని శరీరమునకు మర్దన చేసి, కాళ్ళు కూడా
వత్తుచుండెడిది.



రోహితుడు చిన్నవాడగుటచే తన తల్లికి ఇంటి పను
లలో సహాయుడుగా లేక, చుట్టుప్రక్కల నున్న పిల్లలతో
ఆటలాడుకుంటూ కాలము గడిపెడివాడు.




ఒకరోజున—


హా!




ఒక బాలుడు తారామతి వద్దకు పరిగెత్తుకుంటూ వెళ్లెను.




ఎక్కడికి వెళదామనుకుంటున్నావు? ఈ పనంతా ఎవరు పూర్తి చేస్తారనుకున్నావు?


రోహితునికి పాము కరచింది. దయచేసి అతని వద్దకు నన్నువెళ్లనివ్వండి.
బుద్ధిహీనురాలా! నువెందుకు బాధపడుచున్నావు? అతడు చనిపోయినచో అతనిని డబ్బుపోసి కొన్నందుకు నేను బాధపడవలసి ఉంటుంది.




ఆ బ్రాహ్మణుడు ఆమెను ఇంటిలోకి నెట్టి......



తారామతి దుఃఖమును, బాధను దిగమ్రింగి తన
యింటి పనులకు హాజరయినది.





కన్నీరు చెంపల క్రిందుగా పారుచుండగా తారామతి పరిగెత్తుకుంటూ....



...రోహితుడు చనిపోయి పడి ఉన్న ఆ స్థలమును చేరుకుని...



తారామతి అమిత దుఃఖము, విచారముతో తన
కుమారుని శ్మశానవాటికకు తీసుకుని వెళ్ళినది.








శ్రమ, దౌర్భాగ్యములు హరిశ్చంద్ర, తారామతుల రూప వేషములను మార్చివేయుటచే ఆ అర్ధరాత్రి వేళ వారు ఒకరినొకరు గుర్తించుకొనలేక పోయిరి.



డబ్బు కావాలా ప్రభూ! నేనెక్కడి నుంచి తీసుకురాగలను? నేను అన్నిటినీ పోగొట్టుకున్న ఒక దౌర్భాగ్య స్త్రీని..
ఈమె మాటలు విన్నట్లున్నది! ఆమె కాదు కదా...




మీరేనా ప్రభూ! విధి మిమ్ము
లను ఎంత దురదృష్టాలు
చేసినది?

తారామతీ! ఏమి జరిగినది? రోహితునికి ఏ ఆపద సంభవించినది?
ప్రభూ! రోహితుడు ఇంక లేడు. అతనిని పాము కాటు వేసినది.

హరిశ్చంద్రుడు చనిపోయిన తన కుమారుని ముఖముమీద కప్పియున్న బట్టను తీసివేసెను.



ప్రభూ! మన మింక ఇతని అంత్య క్రియలు జరుపుదాం.

కానీ ముందుగా నీవు బత్తెమును చెల్లించుకో వలసి యుంటుంది.

ఆ మాటలకు తారామతి ఆశ్చర్యపడినది.




హరిశ్చంద్రుడు శాంతముగా మాట్లాడుతూ—




ప్రభూ! మరల్లి మాట్లాడవద్దు! ఓ దేవా! నాకు సహాయమేము చేయుము.
ఆమె అతనిని ప్రార్థిస్తూ —
మీరు ఏమైనా చేసి నన్ను ఈ దౌర్భాగ్యస్థితినుంచి కాపాడవలసింది.
మనము మన కుమారునికి దహన సంస్కారమునకు చితి పేర్చి దానిలో మన జీవితములను కూడా త్యాగము చేయుటయే మార్గముగా నాకు తోచుచున్నది.

ప్రభూ!
మీకు అన్నీ తెలుసు.
మీరు చెప్పిన విధము
గానే నడుచు
కొందాము.

తారామతి తనకుమారుని శవమువద్ద
విలపించుచుండగా హరిశ్చంద్రుడు
చితిపేర్చి ఏర్పాట్లు చేయుచుండెను.


హరిశ్చంద్రుడు చితికి నిప్పంటించగనే...


... బ్రహ్మ మరియు ఇతరదేవతలు
వారి ముందు ప్రత్యక్షమయిరి.

ఇంద్రుడు స్వర్గమునుంచి చిరంజీవులుగా నుండుటకు అమృతమును వారిపై కురిపించెను.



హరిశ్చంద్రా!
తారామతీ!
ఆగండి!

చితి దానంతట అదే ఆరిపోగా, లోహితునికి తిరిగి ప్రాణము వచ్చినది.




శ్రీకృష్ణుని ఇంద్రజాల మహిమచే హరిశ్చంద్రుడు, తారామతి, లోహితుడు రాజరికపు వస్త్రాలచే అలంకరించబడిరి.



బ్రహ్మదేవునికి నమస్కారములు. నాయజమాని సంగతేమిటి?

హరిశ్చంద్రా! భయపడవద్దు. అతడు మరెవ్వరో కాదు. సాక్షాత్తు ధర్మరాజు.

హరిశ్చంద్రా! నీకు ఘన విజయము! నీవు నిజమును నిలబెట్టుటలో మా అందరి ఆశలను, ఊహలను అధిగమించినావు.




హరిశ్చంద్రా! నీకు నా ఆశీర్వాచనములు!

హరిశ్చంద్రా!
నువ్వు నిజముగా మానవులందరిలోనూ సత్యవంతుడవు, దానశీలురుడవు. కటిక దారిద్ర్య స్థితిలో కూడా నీవు ఇచ్చిన మాటను నిలబెట్టుకున్నావు. నీ రాజ్యమును నీకు తిరిగి ఇచ్చుచున్నాను. ఆయురారోగ్య ఐశ్వర్యములతో చిరంజీవివై వర్ధిల్లుగాక!

విశ్వామిత్రునికి జయము!

హరిశ్చంద్రునికి జయము!

హరిశ్చంద్రుడు, తారామతి, రోహితుడు అమితానందముతో, సుఖసంతోషములతో అయోధ్యకు తిరిగి వచ్చిరి.





1. 'ప్రార్థన'ను ఉదయమున ప్రథమ కార్యక్రమముగాను, సాయంసమయమున అంత్య కార్యక్రమముగాను పాటించుము.

2. ప్రతివారితోను మంచిగా యుండుము. ఇతరులను నొప్పించు పదములను మాట్లాడవద్దు; ఇతరులకు కీడుచేయ ప్రయత్నించవద్దు.

3. మీ కోపమును చంపుకొనుము— అదే మీ భయంకర శత్రువు. సహనమును కలిగియుండి, ఎల్లప్పుడు చిరునవ్వుతో యుండుము.

4. ఎల్లప్పుడు సత్యమునే పలుకుము. ''సత్యమే దేవుడు''.

5. మీ విధిని నమ్రతతో హృదయపూర్వకముగా నిర్వర్తించుము. "విధియే దేవుడు".

6. దానబుద్ధి కలిగియుండుము. అభాగ్యులకు సహాయముచేయుము. బీదవారి యందు దయ మరియు కృప కలిగియుండుము.

7. ఇతరులతో శత్రుత్వము సృష్టించుకోవలదు.

8. జీవనమున నమ్రత కలిగియుండుము; గర్వము కలిగి యుండరాదు. ఇతరులను కించపరచ ప్రయత్నించవద్దు.

9. మితముగా మాట్లాడుము; మితముగా భుజించుము; ప్రతి విషయములోను మితముగా యుండుట మంచిది.

0. పరిశుభ్రముగా నుండుము. దైవత్వము తరుపరిది పరిశుభ్రతయే.

1. జీవనమున రెండు విషయములను మరచిపోండి;
   (1) మీరు ఇతరులకు చేసిన దానము.
   (2) ఇతరులు మీకు చేసిన హాని.

